# వీ రా బా యి

కృ తి క ర్త

రా చ కొం డ సూ ర్య నా రా య ణ మూ ర్తి

Published by R. V. Narasimham
Retired Head Master
Thummpala

[ వెల 0 – 12 – 0

# తొలిపలుకు

వయసునఁ జిన్నలయ్యుఁ గవితాపాటవమునఁ బెద్దలయిన యువక పుంగవులలో శ్రీ రాచకొండ సూర్యనారాయణమూర్తిగారొకరు. కవితా పాండితులు. వీరికిఁ బరంపరాగతములైన సంపదలు: వీరితండ్రి గొప్పకవి; తాతగారు జ్యోతిరాది శాస్త్రములందు నిష్ణాతులు. వర్తమానకాలానుగుణముగా వీరాంగ్లవిద్యాభ్యాసమే కావించినను వంశసహజమైన సంస్కారమునకు వెలియైనవారుకారు. బాల్యమునుండియు నాంధ్రగీర్వాణ కావ్యరసములం దోలలాడి లలితమధురమైన కవితాపాటవమును గడించినారు. ఆ కవితాదేవియొక్క ప్రథమావతార మీ వీరాబాయి.

ఆదికాలమునుండియు భారతీయులు బహువిధవిద్యలయందువలె బాహుబలసంపదకును పేరుపొందినవారు. అందును రాజపుత్రులు ప్రాణములకంటెను శౌర్యాభిమానములనే యెక్కువగాఁ బ్రేమించి కీర్తినందియుండిరి. మధ్యకాల భారతదేశచరిత్రారామము రసపుత్రశౌర్యప్రసూనముల సువాసనావిశేషములచే గుబాళించుచుండును. సమయము వచ్చినప్పుడు రాజపుత్రాంగనలుకూడఁ బ్రాణములఁ దృణీకరించి తమ యభిమానధనత్వమును బ్రకటించియుండిరి. ఒకవంక లలితామలకాంతికిని, వేరొకవంక దారుణాశనిపాతమునకును నాలవాలములయిన మెఱుపుఁదీఁగెలు వారు. రాణి సంయుక్త, దుర్గాబాయి, ఝాన్సీరాణి మున్నగువారి పరాక్రమస్ఫూర్తి భారతీయుల హృదయములకు గర్వాదరములను, పాశ్చాత్య చరిత్రకారుల కాశ్చర్యాతిరేకమును గలిగించినట్టిదే. సర్వవిధముల వారితో దీటు చేయఁదగిన పుణ్యమూర్తి వీరాబాయి. నిరవద్యమైన యామె పరాక్రమప్రాభవమే యీ ఖండకావ్యమునందలి వస్తువు.

భోగైక పరాయణుఁడైన రాజపుత్రులకు సహజమైన శౌర్యధైర్యముల గోల్పోయిన యుదయసింహుని దౌర్బల్యమెఱింగి యక్బరాతని రాజ్యముపై దండెత్తెను. ఉదయసింహుఁడు సంధిచేసుకొనుట మంచిదనెను. కాని మంత్రిసామంతాదు లందు కంగీకరింపక యుద్ధమునకు సన్నద్ధులైరి. మొగలాయి మహావాహినులధాటికి రాజపుత్రసేన లాగఁజాలకపోయినవి. రాజు ముందు, బీరఁపుమాటలుపల్కిన మంత్రిప్రభృతులుకూడ సంధికి సమ్మతింపవలసిన స్థితి వచ్చెను. ఈసంగతివిని వీరరసమూర్తియైన వీరాబాయి యంతిపురినుండి యరుగుదెంచి, ధృతితూలియున్న రాజపుత్రవీరుల యెడందలకు శౌర్యావేశము కలిగించి, తాను సమరాంగణమునకేగి, పలువురు తురుష్కులఁ దనకరవాలమున కెరగావించి, ధీరుఁడైన యక్బరున కాశ్చర్యముకలిగించెను. సరసహృదయుఁడైన యక్బరు వీరాబాయి పరాక్రమము నగ్గించి సంధిచేసు

కొనెను. వీరాబాయి గంగకలిసిపోనున్న రాజపుత్రగౌరవము నావిధముగా నిలబెట్టి యాచంద్రార్కమైన కీర్తి గడించెను.

కథచిన్నదయ్యు నాద్యంతము రసదోహలముగా నున్నది. మూఁడవ యాశ్వాసమొక వీరరస సముద్రము. అందుఁ బ్రతిపద్యమునను ఆ రసము పొంగి పొరలిపోవుచున్నది. కవి యుదయసింహుని భోగైకపరాయణతను, వీరాబాయి మానాభిమానమును, నక్బరు సరసమంజుల హృదయత్వమును చక్కఁగాఁ జిత్రించెను. తనసేనలు వీరాబాయి పరాక్రమము నోర్వలేక యోడిపోయినప్పుడు పరిస్థితి గ్రహించి యక్బరు సంధిచేసుకొనుటయే కాక వీరాబాయికడకేగి యామె పరాక్రమోత్కర్షమును బ్రశంసించెను. శత్రువునందలిగుణముల గ్రహించి ప్రశంసించుటకుఁ జాలిన యౌదార్య మెచ్చటనో కాని యుండదుకదా!

కావ్యము హిందూమహమ్మదీయ సఖ్యముతో ముగియుచున్నది. సర్వమతసమానశాలియైన యక్బరు హిందూమతమును బ్రశంసించి తానా మతసూత్రముల వివరించు పురాణములఁ జదివియుంటినని పలికెను. వీరాబాయి యాతని గుణసంపదను బ్రశంసించి సోదరా యని సంబోధించెను. ఈసఖ్యసంబంధము చిరకాల ముండిపోవలెనని వారిరువురును వాంఛించిరి. కావ్యముద్వారా కవి బోధించిన యీనీతి యీకాలమున సర్వభారతీయులకును శిరోధార్యమనుటలో సందియములేదు.

కావ్యమునందలి పద్యములన్నియు సలక్షణమైన భాషతోడను, సరసములును జాతీయములునైన భావములతోడను, శ్రుతిసుభగమైన ధారాశుద్ధితోడను విరాజిల్లుచున్నవి. వాని యన్నిటియందుఁ గవి కూర్పునేర్పు విస్పష్టముగాఁ గానిపించుచున్నది. అన్యదేశ్యపదము లచ్చటచ్చటఁగలవు. అవి యచ్చటిసందర్భమున నతికి మనోహరముగా నున్నవి. కావ్యమున వ్యాకరణస్ఖాలిత్యము లెచ్చటను లేవు కాని ద్రుతద్విత్వసంధులు మాత్రము పెక్కుచోట్లఁ గానవచ్చుచున్నవి. పోతనాదుల పద్ధతి ననుసరించి కవి యా సంధి చేసియుండును. కావ్యమంతయు యువకుఁడయిన యీకవి భావ్యభివృద్ధికి శుభోదర్కముగానున్నది. భగవంతుఁడీయనకుఁ దీర్ఘమైనయాయువును, బహుగ్రంథరచనాశక్తిసామర్థ్యములను నొసంగి ప్రోచుఁగాతమని ప్రార్థించెదను.

డాబాతోట, విశాఖపట్టణము, 9 – 12 – 49

దివాకర్ల వేంకటావధాని. M. A. Hons.
ప్రధానాంధ్రోపన్యాసకుడు.
( ఎ. వి. యన్. కళాశాల. )

శ్రీ ర స్తు

# వీ రా బా యి

## -: ప్ర థ మా శ్వా స ము :-

శా. శ్రీరంజిల్లు పరాక్రమంబునకు వా ♦ సింబొల్చుభాగ్యానికే
ధీరోదారుల జన్మకారణమునన్ ♦ దేదీప్యమానంబునై
యారాష్ట్రంగానె వీరరత్నఖనినా ♦ నక్రాంత మీ దేశ మా
శూరాగ్రేసర చక్రవర్తులను వి ♦ ష్ణుండోజఁ గాపాడుతన్.

సీ. ఎవరిపేరెత్తుచో ♦ నెట్టిశూరులకైన
గుండెలు దడదడ ♦ కొట్టుకొనును
ఎవరెత్తివచ్చిన ♦ "నేమిదారి" యటంచు
జంకెద రెదిరింప ♦ బింకముడిగి
ఎవరిపరాక్రమ ♦ మీనాఁటికింగూడఁ
జరితార్థమై నిల్చె ♦ జగతిలోన
ఎవరియాజ్ఞను నిత్య ♦ మీభారతప్రజ
లంఘింపకుండేఁడు ♦ రాజభక్తి

తే. గీ. నట్టివీరోచితస్థాన ♦ మధివసించి
రాజపుత్త్రిలు విపుల సా ♦ మ్రాజ్యమేలి
భారతావని కెనలేని ♦ ప్రతిభ తెచ్చి
మార్గదర్శకులై నారు ♦ మహీపతతికి.

తే. గీ. శత్రుమత్తేభసింహంబు ♦ శాంతియుతము
ధర్మసంరక్షితంబు; వి ♦ ద్యాలయంబు
శిష్టనృపపాలిత మనఁ బ్ర ♦ సిద్ధికెక్క-
మహితరసపుత్రవీర సా ♦ మ్రాజ్యలక్ష్మి.

చ. రణమున వెన్నుఁ జూపిన ♦ పరాక్రమహీనులు; యాచకాళినిం
దనుపని నిర్దయాత్ములుఁ, స ♦ దా శరణార్థులవిడు దుర్మతుల్
వినఁబడ; రొక్క వేళ పృథి ♦ వీపతిపుత్త్రిలయందు నట్టివా
రును గలరేని యన్యగతి ♦ యూహకి నెక్కు నృపాలవంశముల్.

తే. గీ. అంతియే కాని బలహీను ♦ లైన నృపతు
లేఁగుదెంచినమాత్ర లో ♦ కెల్ల గలుగు
రాజపుత్త్రిల మించు ప ♦ రాక్రమంబు
సమయమే తేరఁ జూపించు ♦ సతులు దసర.

ఉ. ఎంతపరాక్రమంబు ఘటి ♦ యించినఁగాని ధరాధినాథు ల
న్నంతన కొన్ని లోటు లెటు ♦ లైనను బొత్తి గలేకపోవు; సా
మంతులు వారు; కొన్ని టఁబ్ర ♦ మత్తులుగాఁ జరియింతు; రొక్కచో
నంతరమున్న యుంగరుదు ♦ రాగ్రహచిత్తులు; భోగమత్తులున్.

ఆ. వె. కీడు మేలు నెఱిఁగి ♦ కేవల మేఱేఁడొ
రాజ్యపాలనమున ♦ రంజకుఁడగు
నిహసుఖంబులందు ♦ నెంతేని మగ్నులా
నట్టివారలుండు ♦ టరుదు కాదు.

తే. గీ. రాజ్యమం దట్టివేళ న ♦ రాజకంబు
ప్రబలి పరరాజ్యజయకాంక్షఁ ♦ బరితపించు
వారలకుఁ దగు సమయమై ♦ పరిఘవిల్లు
నెత్తివత్తురుపో జయ ♦ మేమి బ్రాఁతి?

తే. గీ. ఎట్టిఁడైనను దనసైన్య ♦ మెంతయున్న
నప్రమత్తుఁడు గాకుండు ♦ టాత్మనెఱిఁగి
యట్టిసమయంబునందు ధై ♦ ర్యము దలిర్ప
శత్రు నెదిరింప బొత్తిగా ♦ శక్తిదొలఁగ.

తే. గీ. పౌరుషం బొక్కదిక్కునఁ ♦ బాతిపెట్టి
క్షత్రధర్మంబు గంగలోఁ ♦ గలిపివేసి
బ్రతుకుటయె చాలునని యెంచి ♦ ప్రభువరుండు
సంధికోసము యత్నించు ♦ సగము చచ్చి.

ఉ. బాలురుగారు పాలకులు; ♦ పామరులంచుఁ బ్రజందలంతుమా
వీ లిసుమంత లేదు ; మఱి ♦ భేదముగల్గి నృపాలుఁడుం బ్రజల్
మేలగు వేఱుదారులఁ జ ♦ రింత్రు; వివాదముతో, స్వతంత్రభా
వాలప్రసక్తితో రుచిర ♦ వర్తన దక్కియు మోమయంబుగన్.

ఉ. కాలముమారు దేశమునఁ ♦ గల్గెడు మార్పులతోడఁగూడఁదా
మాలముమాని శూరతకు ♦ నాకరమౌ సుపథంబుఁ ద్రొక్కి భూ
పాలకులెల్ల "వల్లె" యని ♦ పాలనచేసి సదా స్వతంత్రభా
వాలకుఁ దావు చూపవలె ♦ భారము దేవునిపైనిడన్ వలెన్.

ఉ. అంతియొకానిభూమిపతి♦యాగ్రహమున్నటియించి "నేనుభూ
కాంతుఁడ నాకు నడ్డును జ ♦ గంబునఁ జెప్పఁగలట్టివాఁడు లేఁ
డింతకు నేఁదలంపఁ గొద ♦ వేమఱి దేనికినైనఁగాని, యీ
చింతయు దేల నాకు" నని ♦ చేతమునం దలపోసి నిక్కుచున్,

ఉ. అగ్గలమైన స్వేచ్ఛ నతఁ ♦ డన్యవిధంబున దారి తీసినన్
నెగ్గఁగనిత్తురే ప్రజలు ♦ నిల్వరె తా మొకమాట ; మాటకే
భగ్గునమండి శూరజన ♦ వర్యులు కార్యము నాఁగలేరె? కాఁ
దగ్గరణంబుకంటె గణి ♦ తవ్యమగుం బని రెట్టు లయ్యెడన్.

తే. గీ. శూరులందఱు యుద్ధంబు ♦ కోరుచుండ్రు
భీరువై రేఁడు సంధికై ♦ వేడుచుండుఁ
బనికిరాదని వారలు ♦ పంతగింత్రు
వారికంటెఁ దక్కువ తిన్న ♦ వాఁడె నృపతి.

ఉ. చీటికిమాటికిం బ్రజల ♦ చిత్తమెఱింగియు భూపుఁడున్ నిరా
ఘాటముగా నిరంకుశము ♦ గాఁ జరియింప స్వతంత్రతార్థులీ
నాటకమున్ సహింపక వి ♦ నమ్రములుగాక చరించుచో నృపుల్
గోటనుమీటునట్టిపని ♦ గొడ్డటఁగూడ నసాధ్యమయ్యెడిన్.

ఉ. చేయునదేదిలేక యెటు ♦ చెప్పిన నట్లొనరింతునంచుఁ బ్రా
ధేయపడంగ నానృపుని ♦ దిక్కని నమ్మి ప్రజల్ చరించుచోఁ
బాయు కసాయిమేకలుగు ♦ భావము వానిదివేఱుగాఁగ; వా
రే యపరాధులౌ ప్రజ'లి ♦ హీ'యని వారినె నింద సేయుదుర్.

ఉ. అప్పుడు పౌరుషంబున మ ♦ హాత్తరలీలఁ జరింత్రుగాక; యా
గొప్పయశంబువచ్చి తమ♦కిన్ ఘటియించునె" కానియెందుకీ
పిప్పిప్రసక్తి మాకుఁ దల ♦ పెట్టిన యట్టి కథావిధానముఁ
జెప్పఁగరాదె" యంచు నిర♦సింపకుఁ డింకవచింతుఁ బాఠకుల్.

## — : కథాప్రారంభము : —

ఉ. చేడియు, లోకమంచుదయ♦సింహాన్నృపాలుఁడుకీర్తినెంతయున్
బూడిదఁబోసి యంతిపురి♦భోగపరాయణుఁడౌచు మున్నుమే
వాడఁ జితోడుదుర్గమునఁ♦బాలనసేయఁదొడంగె; భూపతుల్
కీడును మేలుఁజూచెద రె? ♦ కేవలసౌఖ్యములన్ నిమగ్నులై.

చ. సునిశితఖడ్గధార నృప ♦ సూనులఁ బోర జయించి, బాంధవం
బును దగ, హైందవోత్తముల ♦ ముఖ్యులుగా మొగలాయి రాజ్యమం
దొనరిచి తండ్రిగారు హుమ ♦ యూను మహాశయునిన్నమోఘవా
క్యనిగరచించిఅక్బరుమ♦హోన్నతుఁడై వెడలెన్ జితోడుపై.

ఉ. "భూపుఁడు భోగవారినిధి♦ఁబుంగి ప్రధానికి రాజ్యభారమున్,
మూఁపున మోపవాఁడుపరి♦పూర్ణమదాన్వితుఁడై చరించియా
"బాపతి" వారిగాఁగఁ బరి ♦ వారజనంబుఁ దయారుచేసి దా
డావు నృపాలుఁడాతఁడని♦తన్ను దలంప యథేచ్ఛనుండెడిన్.

తే. గీ. ఐకమత్యంబు లేక రా ♦ జ్యమ్మునందుఁ
బ్రజలు కొట్లాడుచున్నారు; ♦ పట్టపగలు
చుక్కలం బొడిపించెద ♦ రక్కజముగ
ననుచు" నందందుఁ బ్రాకెఁడు ♦ నవసరమున.

ఉ. చారులవల్ల నక్బరు ప్ర ♦ సక్తికతంబున విన్న యీ- సమా
చారముఁబట్టి, దాడికొన ♦ సాగి జయంబుఘటించునంచు వి
స్తారబలంబు తన్గొలువఁ ♦ జయ్యనవచ్చెను; శక్తిహీనతల్
ఏరినిఁ బ్రోత్సహింప వొన ♦ రింపఁగఁబోవెటువంటికష్టముల్.

తే. గీ. ఉదయసింహుని కీవార్త ♦ యొక్కసారి
పిడుగుపడినట్లు గగనంబు ♦ వెన్ను మీఁద
విఱిగిపడ్డట్లు దోఁచిన ♦ బెంగఁగ్రుంగి
తెల్లఁబోయెను చెమట ని ♦ ల్వెల్లఁబట్ట.

తే. గీ. ఏమికర్తవ్య మేనిప్పు ♦ డేమొనర్తు
ననుచుఁ జింతించి యేమేమొ ♦ యాత్మనెంచి
గజగజమని కాళ్లు వణఁక ♦ గాఁ దొడంగ
నాతఁ డట్టె కన్నీటి ప ♦ ర్యంతమయ్యె.

మ. సమరంబుంబొనరింపభీతి యొకడు♦చ్చండంబుగాఁ బర్వఁ బా
పము! భూమీంద్రుఁడుచేతులన్నలిపి"గ్రా♦వంబంతభారంబుశీ
ర్షముపైనున్నది;సంధిసేయుఁడనస♦ర్దారుల్ విడంబింత్రు;మా
ర్గము నాకెయ్యది" యంచుఁ జింతఁగొనెఁ గిం ♦ కర్తవ్యతా
మూఢతన్.

చ. మృదువుగ ముచ్చటింపమితి ♦ మీఱి ప్రసంగము సేయు మంత్రి; నా
కెదిహితమౌనొ యాతనికి ♦ దేయుహితంబగు; మంచిచెడ్డ చూ
డఁదగదు వానినాలుక ♦ కటా! యెటులాతనినోట నోరిడం
గఁదగును? బచ్చగడ్డినిడఁ ♦ గా నదిమండదె మాకుమధ్యగాన్.

తే. గీ. యుద్ధ మొనరింపఁబోయిన ♦ నొక్కచిక్కు
దగినసన్నాహమందునఁ ♦ దవులకునికి
సంధికనిన వేఱొకచిక్కు ♦ సఘటించు
మానధనులైన మావారి ♦ మక్కువచెడ.

చ. అయినను మంచిమాటలఁ బ్ర ♦ యత్నముచేసెదఁగాక! వారికి
ప్రియముగఁదోఁచుచో నపుడు ♦ వీలునుబట్టి రణంబు సేయ ని
శ్చయమొనరింతుఁగాక; యిది ♦ చన్న నృపాలునకంచు లోననే
మియొ తలపోయుచుండెను ని ♦ మీలితలోచనుఁ డౌచు న
య్యెడన్.

తే. గీ. ప్రొద్దుజామెక్కెఁ; దలుపులు ♦ గుద్దుకొనుచు
శత్రు లలజడి గావించి ♦ సంగరమున
కరుగుదెమ్మని గర్జింతు ♦ రైనఁగాని
యంతులేదయ్యె భూపుని ♦ చింతకంత.

మ. కొలువుందీర్చెడి వేళదాటభటము ♦ ఖ్యుల్ కొందఱే తెంచి, యం
జలిగావించి "ప్రభూ! సభాస్థలికిదే ♦ సర్దారు లే తెంచి, మి
మ్ములఁదో తెండని వేగిరంపడుచుమ ♦ మ్ముంబుచ్చి వారియ్యెడన్
సెలవేమంచు వచించి నిల్చుటయు లే ♦ చెన్ బోవ రాణా వెసన్.

శ్రీ ర స్తు

# వీ రా బా యి

## —: ద్వి తీ యా శ్వా స ము :—

తే. గీ. మంత్రి దుమదుమ లాడుచు ♦ మండిపడుచు
వరుస సర్దారు లందఱు ♦ బలిసి కొలువఁ
గొలువుకూటంబు సొచ్చి మై ♦ పులకరింప
నృపుని దవ్వునఁ గని వచి ♦ యించు నిట్లు.

ఉ. మీరును మీరుమీరు మఱి ♦ మీరును మేటి వివేకులైన స
ర్దారులు బ్రాఁతిగా నృపకు ♦ లంబునఁ బుట్టినశూరులయ్య! మీ
నేరుపుచూపి క్షాత్రమవ ♦ నిన్నిలుపం దలపోయఁగావలెన్
భూరియశంబు దాల్పవలెఁ ♦ బోవలె నేఁడు తురుష్కులేడ్చుచున్

చ. తరుణము వచ్చెనయ్య సర ♦ దారులు బాహుబలంబు చూప; నీ
కలితతురుష్క సైన్యమును ♦ గాటికిఁ బంపఁగ; మూటములైన సం
గరమునకింక సజ్జితులు ♦ గావలెఁ గాక; నృపాలుఁ డొక్కచోఁ
బిఱికితనాన వేఁడినను ♦ వెఱ్ఱిగ సంధికి నొప్పుకొప్పునే ?

మ. కలకాలం బిటు లస్వతంత్రతకునై ♦ కర్మంబె లోఁగన్ సదా
వలదే స్వేచ్ఛ? భయస్థుఁడై నృపుఁడు "భా ♦ వ్యం" బంచుఁ
దా సంధికిన్
దలపెట్టు; న్మన మొప్పుకోవలెనె? యు ♦ ద్ధంబాతఁ డిచ్చింపఁడ
వ్వల కానున్నది కాకమానదిది మీ ♦ భావంబునం దుంచుఁడీ !

చ. అనుచునమాత్యుఁడందఱకు ♦ నాచరణీయమునూటిపోసి యా
వెనుక సమాయకుండువలెఁ ♦ బీఠముపై వసియించె; నింతలో
జనపతివచ్చి వారలిడు ♦ స్వాగతముంగొని పుట్టి మున్గిపో
యినగతిఁ జింతఁ గ్రుంగి వసి♦యించె నిజాసనమందు నాసభన్.

చ. తురకలు వచ్చి దుర్గమును ♦ దుందుడు కొప్పఁగ ముట్టడించి సం
గరరభసంబుతో నునికిఁ ♦ గన్నులు నిప్పులు గ్రక్కుచుండ స
త్వర మని సేయనున్న సర♦దారులఁ గాంచి, భయంబు దోఁపన
స్థిరతరచిత్తుఁడై ఉదయ♦సింహుఁడు మానము దాల్చెఁ బెల్చనన్.

ఉ. "తాను నృపాలుఁడౌనట! స్వ♦తంత్రత గల్గఁట! తక్కువారలో
పూనిన కార్యమెల్లఁ దుద ♦ ముట్టెడిదాఁకఁ ద్యజింపరంట! ప్ర
జ్ఞానిధులై ప్రసిద్ధిఁగను ♦ సంగర శూరులు వోల్తురంట! తా
మానము దాల్చనేమి" యని ♦ మంత్రులు కొంత గొణంగి
రయ్యెడన్.

ఉ. ధీవిభవంబు దక్కి జగతీపతి ♦ 'చచ్చినచావు' వచ్చెనం
చావిధిఁ గూరుచున్న హృద♦యంబున సంగ తెఱింగి మంత్రి రా
ణావినుభంగి 'యుద్ధముహా ♦ నర్తముగాక' యటన్న సంధిప్ర
స్తావన దెచ్చె భూమిపతి ♦ సంగర కాంక్షుల శాంతమారఁగన్.

తే. గీ. యుద్ధ మొనరింప సర్దారు ♦ లుత్సహించి
యవనిపతిమాట కాగ్రహ ♦ మగ్గలింప
వారిలో వారె గుద్దు కొ ♦ న్నారు కొంత
పలికె నావెన్క నృపతియు ♦ నలుక దొలఁక.

కం. "ఘనబాహు పటిమమీఁదం
గను సంగ్రామంబు సేయ ♦ క్షత్రియులకు ధ
ర్మ నియతి" యని ప్రాజ్ఞులనుట
యును నృపులాగతి నడచుట ♦ యును దెలిసి మదిన్.

తే. గీ. సంధికోసము యత్నించు ♦ సరణి మీవుల
హేయమే యంచుఁ జెప్పెద ♦ నిట్టులయ్యు
దానికోసమె యత్నింపఁ ♦ దవులుటకును
గారణములుండె; లేకున్న ♦ గడఁగుదునొకో !

కం. విధిదృష్టమైన సంగతి
వృథగా దోసంబటంచు ♦ వెట్టినె? పలుకన్
వృథయంచుఁ దలంపక సా
వధానమున వినుఁడు దాని ♦ వైఖరి యింకన్.

ఆ. వె. శాస్త్రమెఱుఁగువాఁడు ♦ సద్వంశసంభూతుఁ
డైనవాఁడు నెక్కు ♦ డైన బలము
గలుగువాఁడు ధైర్య ♦ గరిమంబు వాఁడును
శత్రువైన సంధి ♦ సలుపు టొప్పు.

ఉ. సర్వమతంబులం గలుగు ♦ సారము నీరముగాఁగ గ్రోలి ని
ర్గర్వగఁ దోఁచు నీశని కు ♦ లం బకళంకముగాకపోదు; నేఁ
డుర్వర నాల్గుదిక్కులకు ♦ నొక్కవిధంబుగ వీనికీర్తియుం
బర్వఁగతంబుమీఱెఱుఁగు ♦ వారనఁ జర్వితచర్వణంబగున్.

చ. ఎఱుఁగరెరాజపుత్త్రకుల ♦ నెందఱ నగ్బరు గెల్చినాఁడొ? భీ
కర సమరాంగణంబున నొ♦కండెనయానొకో! వానికెందుఁ; జి
చ్చుఱపిడు గట్టివానిపయి ♦ శూరతఁ బోవుట వింటిరేని న
ల్గుర నగుబాటుగాదె? పలు♦కుల్ మఱిడెబ్బదిపల్క నేమియౌ.

చ. అవసరమున్ గ్రహించి, యుచి♦తానుచితంబులు నిర్ణయించి, శ
త్రువుల పరాక్రమం బరసి ♦ రూఢిగ వారిజయించు ధైర్యముం
దవిలినఁగాక పీఁకఁ జని ♦ దాడి సమంజసమా నె? యెట్టి శూ
రవరులకైన; మీ రెఱుఁగ ♦ రాయిది సర్వమెఱుంగునట్టిరే.

కం. తనబలము నెదిరి బలమును
గనుఁగొని యావెనుక మనము ♦ గయ్యంబునకుం
జను టుత్తమంబు గానీ
యనువే యీసాహసంబు ♦ హర్షించెదరే?

చ. అరిబల మేఁగుదెంచెనని ♦ యాయుధముల్ గొని యుద్ధభూమికిం
బురపురలాడి పోవుటల! ♦ పుల్లయ వేమవరాని కియ్యెడన్
సరిగను స్మారకంబగుట♦స్వాంతములం దలపోయుటొప్పు; మీ
రధుదగు బుద్ధిమంతులరు ♦ హానిమెఱుంగక పోరు పోరునన్.

ఆ. వె. తలకుఁ దగనిపనులఁ ♦ దలపెట్టఁగారాదు
వెనుక ముందు లరసి ♦ వీలు దెలిసి
క్రిందుమీఁదుచూచి ♦ కీడెంచి మేలెంచి
ప్రకృతమేది యదియె ♦ వలయుఁజూవె.

తే. గీ. యుద్ధ మొనరింపఁ బోయి తా ♦ నోడవలెనె !
సంధి గావించుకొనుటయుఁ ♦ జాలదోకొ-
శత్రుచేఁ జచ్చు దురవస్థ ♦ సమ్మతించు
కంటె హితముంట లెస్స; సౌ ♦ ఖ్యంబు మనకు.

ఆ. వె. నిండుజీవనములఁ ♦ బండువుగా మీరు
భండనమున నేఁడు ♦ బలిగొనంగ
నిచ్చగింపలేక ♦ యిట్టు లంటినిగాని
సమర మన్న నాకు ♦ జంకు సున్న.

ఉ. మిక్కిలిశూరుఁడగ్బరు ప♦మింపఁగరాని బలాన్వితుండు; మీ
రక్కట! పోరువార? మొగ♦లాయులతో జయమందువార! మీ
మక్కువతీర్చ్కోసమయ♦మాయిది! యంతర మెంతయుండె? న
క్కెక్కడ? దేవలోకమది ♦ యెక్కడ? యోపికసేయుఁ
డిందరున్.

మ. అనిసేయందగునంచు నొక్కఁడనఁగా ♦ "నల్లల్లబీ" రంచు వె
న్కను దాళంబులువేసి గల్లురదియే ♦ కర్తవ్యమంచెంచి, దా
నినిఁగావింపఁగ నుత్సహించుటది కా ♦ నేకాదు నిక్కంబుగా
వినుతింపం దగు కార్యమో? ఘనమతుల్ ♦ వేమారు చిం
తించినన్.

ఆ. వె. అరిబలంబు సూడ ♦ నంభోధి కెక్కుడై
నేల యీనినట్లు ♦ నిలిచి యుండె
సైన్యమిచట మనకు ♦ సాఁబాలు లేదందు
శత్రు నెట్లుగెలువ ♦ సాధ్యపడును?

ఉ. ఇంతయుఁ జింతచేసి తుద ♦ కీగతిఁ జెప్పితి; “రాజునాజ్ఞ క
భ్యంతర మేరుచెప్పఁగల ♦ వారలు? మాకెదు రాడుమానిసిం
గాంతుమె”యంచుఁదీవిదొలఁ♦కంగినుకంబలుకన్న మాత్యుదుః
శాంతిదొలంగి ధైర్యమును♦సాహసముఁ ఘటియింపనిట్లనెఁ

చ. మృదువుగఁ జెప్పఁజాలమిఁక♦మింపున్నపాలవతంస! యిట్టియా
పద సమయంబునందు ధృతిఁ♦బొరఁగఁ దొలుట రాచపాడిగా
దిది తమకేను జెప్పవలె ♦ నే? మన మెట్టి కుటుంబమందు న
భ్యుదయము నొందినాము! మన ♦ మూను ప్రయత్న మదేమి
భూవరా!

తే. గీ. మంత్రి నేనయ్యు నెదిరించి ♦ మాటలాడు
టనుచితంబని సరసుల ♦ కాగ్రహంబు
గలుగునే కాని కష్టసు ♦ ఖంబు లెఱిఁగి
న్యాయముం జెప్ప వారల ♦ కరిది గాదె!

తే. గీ. శాస్త్రజన్యపరిజ్ఞాన ♦ చతుర మతివి
గాన నింత సోదెను వెళ్లఁ ♦ గ్రక్కు నావు
శాస్త్ర విజ్ఞానమే మాకుఁ ♦ జాలకునికి
నెఱుఁగ మాజోలు; మీరు క్ష ♦ మింపుఁ డెఱిఁగి.

తే. గీ. ఎఱుఁగకున్నను మిమువంటి ♦ యెఱుఁగువారు
పెద్దలున్నారు; వారల ♦ యొద్దఁగూడ
మంత్రినై కొంత కాలంబు ♦ మసలినాఁడ
నకట! వారలు మార్గద ♦ర్శకులు గారె?

ఆ. వె. ధర్మశాస్త్ర మందు ♦ మర్మంబు లన్నియు
వ్రాసి వేసినారు ♦ వరలెనాఁగ
దానిఁ బట్టి మీరు ♦ ధర్మంబు నా నెది
చెప్పినారు నేను ♦ జెప్పలేన?

చ. కడకొని క్షత్రధర్మ మెఱుఁ ♦ గంగఁ దలంచెద రేని శత్రులం
గడపుటొ? లేక చచ్చుటయొ ♦ కేవల మాచరణీయమైనదై
పుడమి నెసంగు; నిందనుక ♦ భూపతి వంశజు లట్టిమార్గముం
బడి చరియించిరియ్యదియె ♦ వన్నియు వాసియుఁ గల్గువారికా

ఆ. వె. శత్రువిట్టిఁ డంచు ♦ జంకొక్కఁ డుదయింప
సంధి సేయు పొంటెఁ ♦ జనునె కడఁగ?
పగర గెలువ మీకు ♦ భయ మెంతగాఁ దోఁచె
మీదు ధైర్యమహిమ ♦ మెచ్చవలదె?

మ. జనసామాన్యమునందునిష్టమెదియో ♦ చర్చించియా మీఁద దా
నినిఁ గావింపఁగఁ బూనుకోవలెనుగా ♦ నీ పెత్తనంబుండి సం
త నిజేచ్ఛన్విహరింపనొప్పుదురె? చిం♦తిం జేయఁగావచ్చునో
జననాథా! ప్రజలే స్వతంత్రులుగదా ♦ సందర్భ మిట్లున్నచోఁ

తే. గీ. పేరునకుఁగాక మనమిష్ట ♦ పెత్తనమున
మసలు టాకభంగి కొంత ప్ర ♦ మాదమయ్యా!
వీరుగాకున్న మనకున్న ♦ భూరియశము
పొసఁగఁ జేయంగఁ గారణ ♦ భూతులెవరు?

ఆ. వె. సంధిమాట నాక ♦ సమరంబె గోరుచుఁ
బలుకుచున్న వారు ♦ వారు వారు
నంధి విషయమెత్త ♦ సందేహ మొంద రే
యిట్టి పందతనము ♦ లెందుకయ్య ?

ఆ. వె. మాటవరుస కేము ♦ మనవిచేయుదుమంతె !
యనుమతింతురనెడి ♦ యాశఁగాదు
మీరు రాకయున్న ♦ మించిపోయిన దేమి
వీఁక శత్రుఁ దాఁక ♦ లేకపోము.

ఉ. మాకెదురాడఁగాఁగలుగు♦మానిసియెవ్వఁడటంచుమీరిటుల్
వాకొను టెంతయేని పొర♦పాటుసుమీ నృపతీంద్ర నేఁడు! నా
దాఁకను బోవనేల ? సర ♦ దారులకే సరదా లుడింగి చీ
కాకు ఘటించె; నే నసలు ♦ గాంచెడివాఁడనె మంచిచెడ్డలన్?

ఉ. పెక్కురమాటయొక్కటిగఁ♦బృథ్విఁజెలంగునుగాక? నేఁడు మీ
మక్కువతీర్పు టెంతయభి♦మానముచచ్చినకార్యమయ్యమీ
కొక్కరి కిష్టమైనదని ♦ "ఊఁ" యని సంధికి నిచ్చగించినం
దక్కిన వారికోరికను ♦ ధ్వంసము చేయుటగాదె భూవరా ?

కం. అని మంత్రి నచించినఁ బతి
వినియును దనవెనుకపాట ♦ విడువం డయ్యెన్
దనకన్న వారి తక్కువ
కనఁబడ దాసభ మటెంత ♦ గగ్గోలయ్యెన్.

మ. పదివందల్ రసఫుత్ర వీరు లిచటన్ ♦ వస్త్రాసులై బాహుదు
ర్మదులై నిల్చిరి; గొప్పసైన్యముసదా ♦ మద్దత్తుగా మంత్రియుం
“బదయుద్ధాని” కటన్న రీతిఁ బొలిచెన్ ♦ భావించిభూపాలుఁడే
“యిదమిత్థం” బని తేల్చఁగా వలయునం” ♦ చెప్పండో వా
క్రుచ్చినన్.

తే. గీ. అంతరాజను “నానిశ్చ ♦ యంబు వినుఁడు
చెప్పుచున్నాఁడ మీకు న ♦ చ్చినదియేని
చేయుఁడారీతి లేకున్నఁ ♦ జిత్తగించి
యిచ్చవచ్చిన భంగిఁ గా ♦ వించు కొనుఁడు.”

తే. గీ. రాజనీతి మీకెఱుఁగంగ ♦ రానిదానా!
యెట్టిసమయంబులం దెట్టు ♦ లెఱిఁగి మెలఁగ
వలయునో మీకు నేఁజెప్ప ♦ వలయునొక్కొ!
మీరు మీయంతవారు మీ ♦ కేరు సాటి?

తే. గీ. సంధిమాటెత్తుటం గాదె ♦ శత్రుఁడైతి
శత్రుభావంబు మనకేల ♦ జాగొనర్ప
కేఁగుఁడిప్పుడ యుద్ధాని ♦ కెగిరి పడుచు
నేనుమాత్రము నాకోఁట ♦ నే వసింతు.

తే. గీ. మంత్రికేను రాకుంట స ♦ మ్మతమె; శత్రు
వీఁక యుద్ధానదాఁకంగ ♦ లేక పోఁడు
పెత్తనము మీది; మీకు మ ♦ ద్దత్తతండు
నామమాత్రంబ నే నర ♦ నాథుఁడైతి.

ఉ. వట్టి వివేకహీనునిఁగఁ ♦ బందగ నిర్ణయ మాచరించి, యి
ప్పట్టున మీర లేకమయి ♦ పల్కిన పల్కులలో యథార్థ మిం
కెట్టులు లేదటంచు రాజు ♦ విప్పుడు సేయఁగలాఁడ, ధీవరుల్
ముట్టడిసేయ వేగముగఁ ♦ బోండి, భయస్థుఁడ నేను రానికన్.

మ. అని మేవాడనృపాలకుండన నమా ♦ త్యశ్రేణి వేఱొక్కది
క్కున గోప్యంబుగ ముచ్చటించుకొని త ♦ ణుక్కుం బెణుక్కు లేకుండ వెం
టన పేరోలగమందుఁ బల్కెఁ; బ్రతి♦ష్ఠన్నిల్వఁగా మీకుఁదోఁ
చినచో మాతుది నిశ్చయంబు వినుమా! ♦ శ్రేయంబు కాంక్షింపుమా!

ఆ. వె. కోఁటఁజేరి మీరు ♦ కూర్చుండువారును
మేము యుద్ధభూమి ♦ మెలఁగు వార
మొక్కొ ? యిట్టిమాట ♦ యొప్పనిదేనాఁడు
మేల్కొనంగఁ దగును ♦ మీరు మేము.

ఉ. అంతిపురంబుగాదు; సమ ♦ రావనియియ్యది; సంధికోసమై
మంతనముల్ త్యజించియభి♦మానము మీఱరణంబు సేయమీ
వంతుగదయ్య! క్షాత్రమని♦ వార్యము; శూరతకున్విరుద్ధమాఁ;
జింతకుఁ దావులేదిచటఁ ♦ జెచ్చెరయుద్ధమె చేయఁగావలెన్.

మ. తమరంగీకృతిఁ జేసినన్ సరియె; ♦ లేదా క్షాత్రసంరక్షణా
ర్థము సర్దారులు వెన్కఁదీయ రసమ ♦ ర్థత్వంబు సిద్ధంబుగన్
భ్రమమీ కెందుకు! శత్రువర్గము లెవ ♦ హ్యోనాఁగ బీభత్సతన్
సమరంబుం బొనరింత్రు; ముందుమిము రా ♦ జ్య భ్రష్టులం
జేయుదుర్.

ఆ. వె. రణము సేయఁదలఁతొ ♦ రాజ్యంబు వీడఁగాఁ
దలఁతొ నేరిగంబు ♦ వలుకు మయ్య
యిన్ని మాటలేల ? ♦ యిప్పటికే నాకు
వినువుప్పట్టె మనసు ♦ విఱిగిపోయె.

చం. అనికఠినంబుగాఁ బలికి♦నంతన తేనికి ముందు నూయియున్
వెనుకనుగోయిఁతిఁ దల ♦ పింపనుహాభయ కంపితాంగుఁడై
కనుఁగవమూసి "భూపతిగఁ ♦ గర్వముకాలి జనించుకంటెఁగా
ననమునవృత్తమాటకడు♦ నాణెమటంచుఁ దలంచి వెండియున్.

మ. సమరంబిచ్చి వహించుటే వెరవు; మా ♦ సర్దారులెల్లేనియు
ద్ధము గావింతురు; నేను వెళ్ళవలె; లే♦ దా! యర్ధచంద్రప్రయో
గము గావింతురుగాని వీడ; రిపుడే ♦ కావింతు రన్నంత కా
ర్యము; సుక్షత్రియుఁడయ్యురీతిఁగొననా♦ప్రారబ్ధకర్మంబొకో ?

కం. అని యొక నిశ్చయమునకుం
జనుదెంచి మనంబునందు ♦ సంకోచంబుం
గినుకయుఁ బెంగొన సభ్యులఁ
గనుఁగొని వచియించెఁ గొంత ♦ కాపటికమునన్.

శా. ఏదో వేఁడితిఁ "గామకూడ"దనమీ♦ యిష్టంబె కానిండు; నేఁ
గాదంచున్ వచియింపఁగాఁ గలపనిన్ ♦ గంధర్వులే తీర్పరా
దా? దురాత్ములు! మీరు దుర్జయులు నా! ♦ తాఁ బట్టు
కుందేటికిన్
బాదంబుల్ త్రయముం దునెగ్గనితీ♦వ్రంబొప్ప నాక్రుచ్చుచున్.

ఉ. "తప్పనియుద్ధ" మన్నసర ♦ దారులదారుల కడ్డ మాతఁడుం
జెప్పుట ప్రాణహానియని ♦ చేయునదేదియులేక భీతియున్
డెప్పరమైనఁగాని ప్రక ♦ టించెననిన్ మొగలాయి వారిపై
ముప్పి దలంచుకొంచు భయ ♦ ముంగొను రాజు జయింప
నేర్చునే!

తే. గీ. వీరి వాదోపవాదాల ♦ విసిగి విసిగి
పశ్చిమాంబుధిలో బ్రుంగె ♦ భానుఁడంత
రేపుగా శత్రువుల తోప ♦ రేపు సమయ
మంచు నెవరియిండ్లకు వార ♦ లరిగిరపుడు.

చ. "ఉదయముదాఁక నేనువ్రత ♦ ముండి భవానినిఁగొల్చిమీఁదవ
చ్చెద"ననిరాణియున్నదయ ♦ సింహునకుంగబురంప నాతఁడ
య్యదనున రాజమందిరము ♦ నందు మహావిరహాంబురాశి నీ
దదిగులువొందుచుంగడిపె ♦ దారఁగనుంగొనుభాగ్యమబ్బమిన్.

శ్రీ ర స్తు

# వీ రా బా యి

—: తృతీయాశ్వాసము :—

చ. విరహుల నెత్తికెక్కి పురి ♦ విచ్చి నటించెడి వెఱ్ఱిబాపి దు
స్తర తిమిరాళిపై కుఱికి ♦ సంగరశూరుఁ డితండునాఁగ వే
కరములఁజావమోది యొక ♦ గంతున గంతుకవచ్చిసూర్యుఁడు
న్నరుతరపూర్వభూధరమ ♦ హోన్నతపంక్తి వసించెనయ్యెడన్

ఆ. వె. మీక జయముగలుగు ♦ వీఁక శత్రునిదాఁకుఁ
డనికి నేఁగుఁడనుచు ♦ నపుడు రాణి
ఉదయసింహుఁ బంపె ♦ నుద్రేకముంగొల్పి
విధివిధాన మెట్లు ♦ వెలయునొక్కొ!

ఉ. సాహస మేజలంబుననొ ♦ సంగమముంబొనరించి యుద్ధస
న్నాహమొనర్పఁబోక నర ♦ నాథుఁడు తాననిసేయ నాక్షణం
బూహయొనర్చఁబోపమెటు ♦ లుండెనొయాతనిచిత్తవృత్తి; సం
దేహముగొందలింపఁ జను ♦ దెంచినవాఁడు జయించుటెట్టులో!

చ. కఱవగు నేఁటితోఁ బ్రియము ♦ ఖంబిఁకఁదీరె ఋణానుబంధ మీ
యరులకుఁజిక్కువారుహత ♦ మార్చెదరో! చెఱసాలనుంతురో
శరణమొసండు నాకనుచు ♦ స్వాంతమునం దలపోయుఁగాని ధీ
వరుఁడయిశత్రునాజిఁ గెడ ♦ పందలపోయఁడుపాయమేదియున్.

సీ. ఖడ్గంబువ్రాని దు ♦ ర్గము దాటెనేకాని
పైకెత్తఁ దొందర ♦ పడుటలేదు
సమరావనీమధ్యఁ ♦ జరణముంచెనుగాని
యెందుండెనో తన ♦ కెఱుకలేదు
అంచుంట హానియా ♦ నంచెంచెనేకాని
యింకొక్కస్థలమేఁగ ♦ నిచ్చలేదు
యుద్ధంబుగావింప ♦ నూహించెనేకాని
శత్రుపై ముందుకు ♦ సాగలేదు

తే. గీ. నృపతి కీలాటి దురవస్థ ♦ నెక్కొనంగఁ
దక్క తనవారి హృదయముల్ ♦ తల్లడిల్ల
మోములందున వైవర్ణ్య ♦ ము ఘటియింప
శూరవరు లప్పు డుత్సాహ ♦ శూన్యులైరి.

ఉ. క్రన్నన శత్రులందుపెము ♦ ఖత్వముదోపఁ దురుష్కులుబ్బి, యా
పన్న వివేకహీనుల న ♦ పార నిరస్త సమస్త ధైర్యసం
పన్న నృపాలబాలక క ♦ పాలములం దెగవేసిరయ్యో! ముం
దున్న ముసుళ్లపండుగకు ♦ నోగిత మియ్యది కాకపోవునే?

ఆ. వె. శత్రులందు సమర ♦ సంతోష ముదయించు
సమయమున గెలువ న ♦ సాధ్యమేమొ!
యొకరి మొగము లొక్క ♦ రుత్సాహశూన్యులై
చూచునపుడు జయము ♦ చోద్యమగునె?

ఉ. "అత్యనుకూలమైన సమ ♦ యంబిది; దీనిని వ్యర్థపుచ్చు దా
ర్గత్న్యము మాకదేటి" కని ♦ లావుదలిర్పఁగ నగ్బరున్నిజా
మాత్యులతోడవచ్చి గిరి ♦ మంబునఁ జట్టునజుట్టుముట్టె; నా
చిత్యమెఱుంగమి న్నదయ ♦ సింహుఁడు చిక్కెఁ దురుష్కు
లుబ్బఁగన్.

ఉ. నాలుగుదిక్కులందు నర ♦ నాథుఁడు చిక్కినవార్త యుల్లక
ల్లోలముగాఁ గ్రమ్ముటయు ♦ రోజుచు శూరవరేణ్యులంత గు
ప్తాలను గ్రమ్మరించి రణ ♦ రంగము నందున నిల్వకుండఁగాఁ
గాలుకొలంది పాఱిరి చె ♦ కాపికభీతిఁ బరోన్ముఖంబుగాన్.

ఆ. వె. రాజుపట్టుపడుట ♦ రణశూరు లందఱు
తిరిగివచ్చుటయును ♦ దెలిసి, మిపుల
హేయపడెడివారు ♦ నిస్సీ యనెడివారు
బాష్పధార విడుచు ♦ వారునైరి.

ఉ. "రాజును దుష్టశత్రుల క ♦ రాలకుఁ బౌరుష హీనవృత్తిఁ దా
మాజి బహూకరించి రఁట ♦ యందము చూడు మొగాల
యందు; బల్
తేజముగీజము౦ దెలివి ♦ తేటలుఁ దెల్లము సేసినారు, ఛీ!
ఛీ! జగ" మంచు స్త్రీలు నిర ♦ సింపఁదొడంగిరి రాజపుత్రులన్.

సీ. రణరంగమం దోడి ♦ ప్రాణనాథుఁడు వచ్చె
నని విని తావురే ♦ దనియె నొకతె
యోడివచ్చిన పుత్త్రుఁ ♦ జూడఁగూడ దటంచుఁ
గన్నతల్లియె దృష్టిఁ ♦ గ్రమ్మరించె
వెన్నుఁజూపినవాఁడు ♦ కన్నతండ్రేయంచు
మూసివేసెను దల్పు ♦ బుడుతఁ డొకఁడు
శత్రుఁజంపక వచ్చెఁ ♦ జచ్చు పెద్దమ్మంచుఁ
గండ్లుమూసెను మూఁడు ♦ కాళ్ళముసలి

తే. గీ. క్షాత్రము న్నిల్పలేకున్నఁ ♦ జావరాదె
రాజపుత్త్రిల మన పేరుఁ ♦ దేజమెసఁగ
వసుధ ధరియింప నంత దా ♦ ర్భాగ్యమేల
వచ్చెనంచు నాబాల గో ♦ పాల మొక్క
రీతిగాఁ బల్కెరెంతయు ♦ రోఁతగాఁగ.

శా. తేజంబున్ దిగద్రావి క్షాత్రమును వ్య ♦ ర్థీభూతముం జేసి, య
య్యాజింబాఱినధూర్తులన్ విగళ ద్ధై ♦ ర్యస్ఫూర్తి సంవర్తులన్
రాజద్రోహులఁజూడ రాణియగువీ ♦ రాబాయి కాంక్షించి, తా
రాజువ్వైవడివీడె నంతిపురి శౌ ♦ ర్యాటోప మేపారఁగన్.

మ. "పరుగెత్తుండని" కంచు నొక్కరుఁడు; "లా ♦ భంబేమిలే" దంచు నొ
క్కరుఁడున్; "సంధిపొనర్చుకొం" డనిను ఱొ ♦ క్కండున్ "
"విజృంభించుచో

'ఫరవా'లే"దని వేళాకోళంబు; "భుజగ ♦ ర్వంబింక శేషించుచో
సరదాతప్పక తీరిపోవునని ద ♦ స్త్రావేజుగాఁ జెప్పిదం
చోరుఁడొక్కండును దోఁచినట్టులని యే ♦ దో సంధిగావింపఁగన్.

తే. గీ. మంత్రులందఱు కొలువుండి ♦ మంతనములు
సలుపుచున్నారు వీరల ♦ తెలివి కాల
వీరినే యమ్మగన్నదో ♦ వీరులంట"
యనుచు వృద్ధసేవకుఁడొక్కఁ ♦ డనియె వచ్చి.

శా. ఏమీ మంత్రులు సంధికంచు మొగలా ♦ యీ వారినింకోరుటా?
సామర్థ్యంబును క్షత్రియాన్వయము ని ♦ స్సారంబులై పోయెనా?
యీ మాత్రానికె వీరికింత తెగని ♦ ల్గా? బుద్ధియుం దేలకో
సామంతంబుగ గడ్డిమేసినది? యీ ♦ చండాలురన్ సైతు నే

కం. చనుమేను వచ్చుచుంటిని
కనుఁగొనియెద తందనాలు ♦ కా విపుడో యీ"
యని 'యాగతు'తో ననుచును
గనుగవ నిప్పుకలు గురిసి ♦ కాలాహివలెన్.

కం. కరవాల ధార శత్రుల
శిరముల ఖండించు వీర ♦ సింహుఁడు నాఁగం
బురుషాకృతి సఖులంగొని
తురగముపై నెక్కి సభకుఁ ♦ దోతెంచి వడిన్.

శా. వీరావేశముతోఁ బరాక్రమముతో ♦ విస్తార దుఃఖమ్ముతో
భారంబైన మనంబుతోఁ గినుకతో ♦ బ్రాఁతైన రౌద్రంబుతో
వీరాబాయి తురంగమున్ దిగి యనున్ ♦ వేష్టించియున్నట్టి స
ద్దారుల్ సభ్యులు భీతిస్తబ్ధులయిని ♦ ల్వాన్ రాతిబొమ్మల్ బలెన్.

ఉ. ఇందరు రాజపుత్త్రకు ల ♦ హీనబలుల్ సరదారు లుండియుం
బందతనంబు సూపుదుర ♦ బాపురె! మిమ్ముపు డేమి సేసినం
జెందు నెపాతకంబు; తమ ♦ చేతుల గాజులు దాల్తురింతకుం
గుందఁగ నేమిలాభ మనఁ ♦ గూడదు గాని పరాక్రమంబిదా?

చ. మునుపురణంబులన్ సలుప ♦ మో? జయమందమొ! నాఁటి రక్తమిం
దనుక భవచ్ఛరీరముల ♦ నాళములం బ్రవహింపదొక్కొ? యే
మనవలె మీమగంటిమి? స ♦ మర్థత క్షత్రియులందు నెందునన్
వినబడ దిట్టిరెన్నఁడుఁ బ్ర ♦ వీణులు మీరెటువంటి వారొకో?

ఉ. పుట్టుక క్రింద నేమరణ ♦ మున్ విధి "తప్పనిదంచు" వ్రాయఁడే
దిట్టలు! మీరు సాక భువి ♦ దేహముల న్నిలఁబెట్ట నుట్లలో
గట్టిగఁ గట్టి వ్రేలుదురె? ♦ గౌరవహానికి నుత్సహించు మీ
పుట్టుక బుగ్గిగానుబోర ♦ పొచ్చెముతోడి వివేక మేద్వనే?

శా. ఆహా! యెంత విచిత్రసంఘటన? స్వ ♦ ప్నావస్థ కాదే కదా?
యోహో! నాఁగ విపక్షపక్షమునుయు ♦ ద్ధోర్వీస్థలిన్ ద్రోయు హే
మాహేమీలగు రాజపుత్త్రులె నిజా ♦ మ్నాయంబుఁ గోల్పోయినా
రా? హాస్యాస్పదమైన సంగతిది కా ♦ దా? యెన్ని జన్మాలకున్.

ఉ. చచ్చిరి, వీరస్వర్గము య ♦ శంబిట వీడి యలంకరించి రె
క్కచ్చిగఁదోడియోధులు;బి ♦ కారి ముఖంబులుదాల్చి వెండి యన్
వచ్చితి రీరు సిగ్గువిడ ♦ నాడి; రణంబున భీతచిత్తులై
వచ్చిన క్షత్రధర్మమును ♦ బగ్గము పాడొనరింతురే స్విరో !.

ఉ. వీరు లనంగ వారె పది ♦ వేలకుఁ; జచ్చిన నొక్కసారియే
శూరతఁ బోరిచచ్చిరని ;♦ శూన్య పరాక్రమ విక్రమోద్ధతిం
బాసి శరీర రక్షణముఁ ♦ బాయక మీరొనరించుకొంచు వే
సారులు గూడఁజచ్చెదురు♦శౌర్యము పట్లనుమీకుసాటియే ?

ఆ. వె. చంపుటొండె లేక ♦ సమయింపఁ బడుటొండె
యన్య మొప్ప నొక్కొ ♦ యసికి నేఁగ
బ్రతికి యుండెనేని ♦ బలుసాకుఁ దినినైన
బ్రతుక వచ్చునంచుఁ ♦ గుతుక మొక్కొ !

ఉ. పుట్టిరొ ! వీరమాతలకుఁ♦బొల్పు వహించిన మేటిశూరులన్
ముట్టి జయించినారు; తుదిఁ ♦ బువ్వులనమ్మినయట్టి యంగడిం
గట్టెలనమ్మఁ గానలయు ♦ కర్మము గూడెనె! శౌర్యమీగతిం
జెట్టున కెక్కఁ జేయఁగ; మ ♦ సీదులకి య్యోజినో దుస్సర్గముల్ !

ఉ. డక్కక మిమ్ములందరఁబు ♦ టంబును బెట్టెనఁగానయిందులో
నొక్కసి వ్రేలుచూపి "యిటఁ ♦ దుర్భరభూరిగుణుండునాఁగన

మ్యాక్రూలనంజెలంగెడినె?♦యయ్యయో! బుద్బుదతుల్యముల్
గదా,
కక్కురి తెల్లుగల్గినది? ♦ కాయముల న్నిలఁ బెట్టుకోనిలన్.

శా. హోరాహోరివివాదలా!విపులగ♦ర్వోద్భూతవాక్యంబులా!
వీరావేశములా! బలప్రకటనా ♦ విఖ్యాత ఘోషంబులా!
దూరాలోచనలా! పరాక్రమములా!♦దుర్వారశౌర్యంబులా!
ధీరమ్మన్యులు! మీకుసాటియిఁకఁబృ♦థ్విన్ లేరుము న్మాటికిన్

చ. అరుదుగ శూరశేఖరుల ♦ కందఁగరానివి దాల్చినారు మీ
బిరుదులు సంతకేఁగఁబుర ♦ వీధులఁ జేతుల నూపుకొంచునుం
దిరుగుటకోసరంబ భవ ♦ దీయులకీ బిరుదాళి నిచ్చిరో
గరువమునం బ్రగల్భములఁ ♦ గల్పన సేయ నొసంగిరో కదా?

ఆ. వె. యుద్ధ రంగమందు ♦ యోధాగ్రగణ్యులు
సంఘమరణ మొంద ♦ స్వర్గమేఁగ
"బ్రతుకు జీవుఁడ" యని ♦ వచ్చినారని గాదె
ధన్యులనుచు మిమ్ము ♦ దలఁప వలయు.

చ. కఱకుతురుష్కహస్తములఁ♦ గాఱియనొందుచు భూపుఁడుండుటే
రెఱేఁగియు సంధికోసరము ♦ హీనతమంతనముల్ ఘటింప నెం
తురుగద! వన్నె కెక్కుతమ ♦ తొంటిపరాక్రమమిట్లు బాదిన
త్తరువును బోసినట్లుసర ♦ దారులు! నేఁడొనరించుటొప్పనే!

తే. గీ. భటుల తోడఁ బరాక్రమా ♦ ర్భటులు చెలఁగ
యుద్ధ భూమికి నేఁగిన ♦ వృద్ధ మంత్రి
పాటి మీవెన్క వచ్చిన ♦ వాఁ డట గద
తనకు వెల్లిన యేఁడు లె ♦ వ్వనికి వెల్లె ?

ఆ. వె. పదవి చూచుకొంచుఁ ♦ బండ్లిగిలించుచుఁ
దమకుసాటి యెవరు ♦ దనర రనియుఁ
గడిఁది మీరు తొల్లి ♦ గరింతురే గాక
ప్రకృతమట్టి దెట్టు ♦ పనికివచ్చు ?

ఉ. ఆపదయందుఁగాక తమ ♦ కాపదవింగలశీలియుం బటా
టోప మదేలయయ్య?టక ♦ టాంకుతనంబిది కాదఁటయ్య? మీ
కీపదవిన్నొసంగిన నృ ♦ పేంద్రునిదోసముసుమ్మి, నేఁడు మా
పై పురి విచ్చె నేమనఁగ ♦ వచ్చువిశేష వివేక పూరితుల్.

మ. కనినంతన్నతిగౌరవంబుగ నమ ♦ స్కారంబులం జేయు వా
రును; వెన్కంజను దెంచువారు భయమున్ ♦ లోనెంచువారున్ సప
ర్యను గావించెడివారుఁ "జిత్త" మనిదై ♦ న్యంబేర్పడంబల్కువా
రును గారేసభలోన నేఁటిప్రముఖుల్ ♦ మోమెత్తరిడ్డే లోకో!

ఉ. అక్కఱగల్గునప్డు ప్రియ ♦ మాదటఁజూపుచుభక్తియుక్తులన్
మ్రొక్కులమ్రొక్కుచున్ వినయ ♦ మున్నటియించుచునుందు
రందరా
మక్కువ లెల్లవేళలొక ♦ మాదిరిగాఁ బచరించు టొక్కఁడే
నిక్కపుభక్తినాఁ బరగు ♦ నీచులెఱుంగరుదాని తత్త్వమున్.

ఉ. ఇంతటి రాజశేఖరుఁడ ♦ యింద్రసమానుఁడ వంచుఁ గీర్తనం
బెంతయుఁ జేయుచుంద్రు ; నృప ♦ తీంద్రుఁడుఁ దా హృద
యంబునందు మీ
రింతటిశుంఠలంచుఁ గల ♦ నేని యెఱింగినవాఁడుగాఁడు; మీ
స్వాంతము లెట్టివో యిపుడు ♦ సాంతముగాఁ దెలియంగ నోపఁడే.

ఉ. ఱెంటకుఁగాక తొల్లి యిను ♦ ఱెంచుప్రసక్తికిఁ గారణంబు వే
ఱుంట యసంభవం బగుట ♦ యున్ విశదీకృత మయ్యె ;
మిమ్మునిలం
గంటికి రెప్పవోలెఁ గనఁ ♦ గల్గెడు ఱేఁడు తురుష్క హస్తముం
దుంటయుఁ గొల్వుదీర తమ ♦ రుంటయుఁ జక్కఁగ నున్న దేసుడీ.

ఉ. మీసల దువ్వుచు న్మగఁటి ♦ మిం బ్రకటించుచు రాజసన్నిధిన్
వేసము లెన్ని యేనియును ♦ వేయుచు నిచ్చకపున్ భృతుల్ వదా
హాసమునన్గ్రహించుతమ ♦ కక్కట! యొక్కరికైనఁగాని వి
శ్వాసము నేఁడు గల్గినదె?♦ చచ్చెఁగదా యభిమానమియ్యెడన్.

ఆ. వె. మీ రెఱుంగరొక్కొ ♦ మేవాడ సంస్థాన
మింతదనుక నెట్టు ♦ లెన్నఁ బడెనొ ?
దేవలోకపతియుఁ ♦ దేఱి చూడఁగ లేఁడు
మానధనుల కిదియు ♦ మనికిపట్టు.

ఉ. దీనిప్రతిష్ఠ యిట్టిదని ♦ ధీవరు లెంద ఱెఱింగి నట్టిదే
కాని మఱొండు కాదుగద ♦ కర్మముదాట వశంబు కాదుగా

నీనిపుణత్వమేర్పడఁగ ♦ నీసము యత్నము సేయుటొప్పదే
పై నిక్కృపాబ్ధిలేఁడె భగ♦ వంతుఁడు మీకు జయంబు గూర్పఁగన్.

ఉ. వేఁడెమిమ్ము భూమిపతి ♦ భీతివహించియొకాక సంధికా
నాఁడపుడేమిచెప్పెదరు ♦ న్యాయము! మీరిపుడట్టి సంధియే
పాడిదొలంగి చేయుదురె ♦ పార్థివపుత్త్రకులార! యత్త తాఁ
గోడలబుద్ధితో మెలఁగఁ ♦ గోరియు నేదియొ తానుజేయుచో.

తే. గీ. ఎంత బాగుండునో మీర ♦ లేర్పడంగ
నాకు బోధింపఁ డొక్కింత ♦ న్యాయమైన
సమభావంబుతో వచ్చి ♦ నారు మొదట
యవసరంబున కేకు మే ♦ కయితిరి గద !

మ. కలిమో గంజియొ దేవుఁ డిచ్చినది చ ♦ క్కం ద్రావుచు
న్నింటఁ బా
పల నాడించుచు నాడుకొంచుఁ గులుకన్ ♦ భావ్యంబుగా
దంచు నేఁ
బలుకన్నో పెడి దాననా! యెవరి ద్ర ♦ వ్యంబీరుదించున్న నున్
దల తాకట్టును బెట్టుకొంటయగుఁగా ♦ దా తందనా లెందుకో?

ఆ. వె. పాటిమీఁద నున్న ♦ పందికొక్కుల రీతి
మెక్కినారు పొట్ట ♦ చెక్కగాఁగ
గడిఁది తిన్నదానిఁ ♦ గక్కించి మిమ్ములఁ
జెవుల నలిపి పంపఁ ♦ జేఁత కాదె.

తే. గీ. మీరు సుఖముండ నెంతురు ♦ మీకు నాత్మ
గౌరవంబున కంటె సౌ ♦ ఖ్య ప్రదంబు
శత్రుతో సంధి సేతయె; ♦ చాలు! మీరు
సాయమొనరింప కున్నచోఁ ♦ జచ్చిపోము.

తే. గీ. మార్తురప్పుడె కోఁట గు ♦ మ్మంబు చేరి
గుద్దుచున్నారు తలుపులు ♦ క్రుద్ధులగుచు
మీరు దివినుండి యీడి ప ♦ ట్టారె! ఘనులు!
చేతకావారయిన నింత ♦ చేటుగలదె?

తే. గీ. చేతకాకున్న రసపుత్ర ♦ సింహులార!
చేతకానట్లు లీమీఁదఁ ♦ జెలఁగ వచ్చు!
సమరమేఁ జేయుదాన స్వ ♦ స్థతగఁబోయి
మిన్నకిల్లుండరయ్య మీ ♦ పున్నె మాయె.

ఉ. క్షాత్రముపూరుషాగ్రణుల ♦ సన్నిధిఁజచ్చినఁజచ్చుఁగాక;లో
కత్రయమున్ జయింప సమ ♦ కట్టిన వారలుగాన; నంతనే
ధాత్రినశింప లేదనుచుఁ ♦ దక్కక నేఁడె యెఱుంగకుండునే
శత్రువు? క్షత్రియాంగనలు ♦ చచ్చిరె!శూరతగొడ్డువోయెనే?

మ. అని వీరోచితవాక్యముల్ నొడివి శౌ ♦ ర్యస్ఫూర్తినశ్వంబుపై
జనియెన్; ఖడ్గములన్ధరించిసఖులున్ ♦ సంరంభచేతస్కలై
వెనువెంటం దురగమ్ములెక్కి కడు గం ♦ భీర ప్రభావోన్నతిన్
రణరంగంబున కేఁగిరయ్యెడల వీ ♦ రాబాయికిన్ బాసలై.

---

శ్రీ ర స్తు

# వీ రా బా యి

## చ తు ర్థా శ్వా స ము

ఆ. వె. రాణి పలుకులందు ♦ రౌద్రంబు మూర్తీభ
వించి యుంట మంత్రి ♦ భీతుఁ డగుచు
క్షణము సేపు గద్దె ♦ స్తబ్ధుఁడై యుల్లాఁడి
తెప్పిరిల్లి పిదపఁ ♦ దెలియఁ బలికె.

చ. బ్రతికియయుండఁగా మనల ♦ రాణియుఁ గర్ణకఠోరవాక్యసం
తతియను నగ్నిహోత్రమున ♦ దగ్ధము చేసిన దేమి సెప్పు! జీ
వితము లిఁకేల? యుద్ధస్పృధి ♦ వీతల మేఁగుద; మిష్ట చింతలన్
గతజల సేతుబంధనము; ♦ గావునరండి! రణంబు సేయఁగన్.

ఆ. వె. ఆర్తి మనకు నిపుడు ♦ కర్తవ్యమేమంచుఁ
బురుషులెల్లఁ జింత ♦ బ్రుంగియుండ
శౌర్యమహిమ స్త్రీలు ♦ సమరావనికిఁ బోర
మూర్తురెల్ల రురక ♦ మనల నవ్వ!

ఉ. మాటలవల్ల రాణి యవ ♦ మాన్యులఁ జేసి వధించె నందఱన్
బోటుమగంటిమి న్వైరవుఁ ♦ బొంపిరివోవ నరాతివర్గముం
గాటికిఁ బంపియే బ్రతికి ♦ క్రమ్మరవత్తము; లేవఁగావలెన్
జోట శిరంబు గ్రుక్కితిమి ♦ రోకలిపోటున కేల భీతిలన్.

ఉ. "పాటి శరీర రక్షణముఁ ♦ బాయక చేసితి"రన్న నోటనే
వీరవరాగ్రగణ్యులని ♦ వీరవధూమణి సంస్తుతింప గం
భీరతురుష్క వాహినిని ♦ వీరవిహారము సల్పినేఁడు మీ
పేరు జగత్ప్రసిద్ధముగఁ ♦ బెంపునఁ జేసికొనంగఁ బోలదే!

కం. అవనీంద్రు లెట్టిరైనను
భవదీయులు గారె! శక్తి ♦ వంచన లేకే
పవరంబుల విజయంబులు
వివిధంబులు గూర్చినారు ♦ విశ్వాస మిఁకన్.

మ. కలదో లేదో పరాత్పరుండెటఁ గెడం ♦ గానిండు; భూపుండు ని
చ్చలుఁ దానిచ్చెడి యేతృణంబొ పణమో ♦ సాపాటుగావించు వా
రలమేలాగు ఋణానుబద్ధులమె! యే ♦ లా దిక్కులిట్లూరకే
తిలకింపన్; జయమయ్యెడున్ ; ఋణవిము ♦ క్తిం బొందుఁ
డో ధీవరుల్.

కం. అని మంత్రి వచించిన నె
మ్మనమున రౌద్రంబు పుట్టి ♦ మఱిలెండంచున్
వెనువెంట రాజపుత్రులు
గొనకొని కడు పెద్దజాతి ♦ గుఱ్ఱాలపయిన్.

ఆ. వె. రాణిదరికిఁ బోయి ♦ రణరంగమం దామె
పాదయుగ్మమంట ♦ భక్తిదనర
శిరములన్ని మోపి ♦ సెమియింపు మని వేడి
పలికిరంత దీన ♦ భావమలర.

కం. కోపింపకమ్మ ! పశ్చా
త్తాపమ్మును బొందినాము ♦ తప్పిదమునకున్
మీ పదదాసులము సుమా
మాపై నెనరూనుమా ! న ♦ మస్కృతు లివిగో !

శా. తల్లీ నేఁడు కృతజ్ఞతం దలఁగి నిం ♦ ద్యంబైన ద్రోహంబు ని
ల్వెల్లం దాల్చినవారమంచుఁ దలఁతే? ♦ విప్వచ్ఛ్వ లేతెంచెనాఁ
గల్లోలంబొనరింతు మీరిపుల; ని ♦ క్కంబింత చూడంగదే!
యుల్లంబందున సంతసింపఁగదె! యో ♦ హోనాఁగ మెచ్చంగదే!

ఉ. కర్ణకఠోర వాక్యతతి ♦ కాదె ప్రబోధముమాకు; నేఁడు సం
పూర్ణపరాక్రమంబున క ♦ పూర్వపుఁ దేజమొకండుమాకిటన్
వర్ణనకున్నసాధ్యమగు ♦ శక్తి జనింపఁగఁ జేసెనో మహో
దీర్ణపరాక్రమోజ్జ్వల స ♦ తీ తిలకంబ! వలంతి వెంతయున్.

శా. చిచ్చుంజొచ్చుటకాజ్ఞనిచ్చెదవొ యా ♦ క్షీణాంబుధింద్రచ్ఛగా
నిచ్చంబుచ్చెదొ! వచ్చినారమిదె త ♦ ల్లీ! వేగ వాక్రుచ్చుమా!
పొచ్చెంబచ్చుపడంగనీము విజయం ♦ బుందెచ్చి శశ్వత్ప్రతి
ష్ఠోచ్చైశ్శ్రీనెగడంగఁ జేయుదుము ధీ ♦ రోదారతా ప్తి న్నతీ!

మ. అనవారింగృపఁజూచి రాణియనువ ♦ హ్వా! లెండి! నే మెచ్చినా
ననవద్యంబగుశక్తిఁ జూపియని సే ♦ యన్ రండి మీరింక; మీ
కెనయా? శూరవరేణ్యులింతవఱకే ♦ రీ? మీకు శౌర్యంబిటుల్
జనియింపన్వచియింతునట్టులు నిరు ♦ త్సాహంబు మానందపున్

చ. అన ద్విగుణీకృతంబయిన ♦ హర్షమునన్ రసపుత్రవీరు లం
గనదిగ్రదావి శత్రువుల ♦ గ్రక్కునముట్టి జయాభిలాషులై
తనువులఁదీపిఁదక్కి ప్రమ♦ దంబునఁ బ్రాణములిచ్చి ప్రాణముల్
గొనుచును దాండవించిరి ర ♦ గుల్కొను రౌద్రము పెంపు
సొంపునన్.

మ. రణరంగంబున విక్రమస్ఫురణ వీ ♦ రాబాయి ఖడ్గంబునన్
గణనాతీతులశత్రుయోధుల నసం ♦ ఖ్యాతంబునౌ సైన్యమున్
క్షణకాలంబున ఖండఖండములుగా ♦ ఖండించి గర్జించె భీ
షణ ఘోషార్భటి;నక్బరొక్కవడి నా♦శ్చర్యంబునస్మ్రాన్పడన్.

ఉ. తొల్లిబృహన్నలాకృతిని ♦ దోర్బలతం గురురాజ సైన్యముం
దెల్లడఁగ్రీడిదోఁచి రచి ♦ యించినవీరవిహార మియ్యెడం
బెల్లునఁబోర రాణి మఱి ♦ పించినవోయనఁ బూరుషాకృతిం
దల్లడ మొందఁజేసె ధృతి ♦ దక్కి తురుష్కులు తెల్లబోవఁగన్.

తే. గీ. జయము తనదాట మొగలాయి ♦ చక్రవర్తి
యుద్ధసన్నద్ధుఁడై యుప్పు ♦ డుండఁడయ్యె
రాజపుత్రులు నూత్న శౌ ♦ ర్యంబుతోడ
నొక్కసారి విజృంభించి ♦ రక్కజముగ.

చ. భళిభళినాఁగతీవ్రతర ♦ భండనమందున రాజపుత్ర వీ
రులు కలగుండుసేయుచుఁ దు ♦ రుష్కభటావళిమస్తకంబుల
న్నిలఁ బడవేసి బాహుబల ♦ మేర్పడ వీరవిహార మిచ్చ వి
చ్చలవిడి మచ్చరంబెసఁగ ♦ సల్పెఁదొడంగి రనల్పశక్తిమై.

3

ఉ. చచ్చినవారు చావ నీకఁ ♦ జాక చకిం బ్రకటింపలేక నె
న్నిచ్చుచుఁ దక్కువార లటు ♦ నిట్టును జూడక పాఱిపోవ 'దు
ఱ్ఱుచ్చి' యటంచు దవ్వుఁగఁదు ♦ రుష్కులనించుక సాగనంపి ముక్
వచ్చిన మచ్చు వెండియుఁ గృ ♦ ప న్బహుమానము చేసి
యార్చుచున్.

చ. రణమున నూత్న శౌర్యము చె ♦ లామణిచేసి నృపాలపుత్రికా
గ్రణులు పరాక్రమించి తొలి ♦ గల్గుఋణంబును జక్రవృద్ధిచే
గణిత మొనర్చి యిట్లు జమ ♦ కట్టిరి రాణియు వారివారి ధీ
గుణపటుబాహుశక్తి కను ♦ కూలముగాఁగ బహూకరింపఁగన్.

ఉ. ఆతరువాత నక్బరుఁ బ్ర ♦ యాస వజీరుల హెచ్చరించి ని
ర్భీతి నెదుర్కొనం బనిచి ♦ వేఁగ గుడారములోన కేఁగి శౌ
ర్యాతిశయంబుతోడ సమ ♦ రావని వీరవిహారము నా వి
ఖ్యాతనృపాలవంశ తిల ♦ కంబగు వీరవధూటిఁ గాంచుచున్.

తే. గీ. తనకు జయమాట స్వప్న వా ♦ ర్తగఁ దలంచెఁ
గదలి మృత్యుదేవత నాఁగఁ ♦ గాంత యొక తె
శౌర్యవిస్ఫూర్తి విహరించు ♦ సరణి మిన్నుల
భీతి యాతని యెడఁద ను ♦ ఱ్ఱూత లూప.

ఉ. నాలుగురోజు లాగతి ర ♦ ణంబు జయాపజయంబు లేకకిం
దేలక సాగెఁ గాక! చను ♦ దెంచిన సైన్యములందు రెంట సా
బాలు నశించిపోయెఁ; దమ ♦ పక్షము డస్సి విరాకుఁ జెందె నం
చోలి తు[illegible]నాయకులె ♦ యుద్ధము సేయఁగలేక భీతిమై.

ఉ. అత్తఱి నోశివారమని ♦ యందఱునుం దెలియంగ బావుటా
నెత్తిరి; రాజపుత్రులు ఘ ♦ టించినభూరిజయామృతంబు ను
న్మత్తతఁ గ్రోలి కీర్తి క ♦ మర్త్యతఁ గొల్పిరి; కత్తి నాటినన్
నెత్తురులేక యుద్ధధర ♦ ణిం దిగఁద్రావి తురుష్కు లేఁగఁగాన్.

మ. తలలన్ వాంచి పరాజయం బి ♦ పుడు సర్దారుల్ నివేదింపఁగాఁ
గలఁతం బొందియు నింతలోన ధృతి యొ ♦ క్కం డింతలోఁ దోఁపఁగా
నెలనవ్వాననమందుఁ గుల్క మొగలా ♦ యీతేఁడు వేవచ్చి, ని
ర్మలచిత్తంబున నమ్రవాక్యములు వీ ♦ రాబాయితో నిట్లనున్.

తే. గీ. అబలశబ్దంబు నేఁటితో ♦ వ్యర్థపఱిచి
సబలలింతులటంచు వి ♦ స్పష్టమట్లు
సలిపినావమ్మ నీకింక ♦ సాటియెవరు ?
పేరుసార్థకమయ్యె నో ♦ వీరవనిత !

ఉ. ఇందఱు శూరవర్యు లొన ♦ రింపఁగ లేనటువంటి కార్యముం
దందరలేక సల్పుటకు ♦ ధైర్యపుసంపద నీకుఁగాక యెం
దుం దలపోయుటొప్పెడిని? ♦ దుస్తరమైనతురుష్కవాహినిన్
గందరగోళమీవిధము ♦ గాఁ బొనరించుటయున్ సుసాధ్యమా?

చ. కొలనున నంబుజాళిఁ గల ♦ గుండు పొనర్చు గజంబు చాడ్పునం
జెలఁగి చలంబు మీఱ నొక ♦ చేడియ వయ్యును శత్రువాహినిం
గలఁచితి; వయ్యెడం బ్రళయ ♦ కాలునకుం బ్రతిరూపు నీది; మై
పులకితమయ్యె నిప్డు గత ♦ మున్ స్మరియించిన నో వధూమణీ!

ఆ. వె. పుట్టి బుద్ధి యెఱిఁగి ♦ పోటు మగంటిమిఁ
బోరి నట్టి వీర ♦ శూరవరుల
నెన్ని వేల మంది ♦ నేఁ జూడ కున్నాఁడ
నిట్టి నిన్నుఁ బోలఁ ♦ డెవఁడుఁ గూడ.

ఉ. ప్రేటునకొక్క వీరుని ది ♦ వింగనఁ బంపితి విట్టి లావు నీ
పాటవ మీనిదాన మిటు ♦ వంటి పరాక్రమ మింత శౌర్య మీ
లాటి వివేక మిట్టి సమ ♦ రంబు ఘటింపఁగ నోపునట్టిఁడే
పోటు మగండునుం గలఁడె? ♦ బోటులదాఁకను బోవ నేటికో!

ఉ. మున్నెటువంటి ధైర్యమునఁ ♦ బోరి రణావని స్త్రీలు మంచి పే
రెన్నిక కెక్కినారనుచు ♦ నెంతయు గొప్పగ వింటినైన మున్
విన్నటువంటి దానికిని ♦ నేనిటఁ గన్నటువంటి దానికిన్
సున్న గదమ్మ పోల్కి యిటఁ ♦ జూడ శతాంశము మున్ను
విన్నదా.

తే. గీ. మీ పురాణము లందు న ♦ మ్మిక గలాఁడఁ
జాల చదివించి నే కొంత ♦ జ్ఞాన మందుఁ
గలిగియే యుంటి; నాతోంటి ♦ కాలమంత
కానలందుంట విద్యయుఁ ♦ గలుగ కున్న.

చ. మునులు పురాణజాలముల ♦ "బోలెడు" వన్నెలు చిన్నె
లేర్పడన్
వనితల ధైర్యసంపదను ♦ వర్ణనచేసిరి; నీదుకాలి గో
రున కేనయానె కైక! యసు రుం దెగటార్చినసత్యభామ తా

ననుపమ వీరకాంతయగు ♦ నా? నినుజెప్పిననోట నన్యఁ దా
నెనకఁగబమ్మ కేనియును♦ నెన్ని సహస్రములుండు గుండియల్.

ఉ. మానిని ! మీకుమాకుఁ బర ♦ మాత్ముఁడు చుట్టఱికంబు
మున్నె సం
ధానితముం బొనర్చె; నొక ♦ నాఁటికిఁ బొమ్మనినంతఁ బోవద
న్యానముదావహంబటుల♦నుండఁగసంధియుఁ జేసికొంద, మీ
పైని హితంబుతో నుభయ♦పక్షము వారు మెలంగుటొప్పెడిన్.

ఉ. ఇందరిముందునిన్నునుతి ♦ యించుటకన్నదికాదుగాని, మీ
హైందవ వీరకాంతలకు ♦ నమ్మరొ నీవొక మేలుబంతివై
యుందువుగాక! నీప్రతిభ ♦ యున్ భువి నారవితారకంబుఁ బెం
పొందునుగాక! నీకుశివుఁ ♦ డోజరచించుఁ జిరాయురున్నతుల్.

ఉ. అమ్మరో! నీపరాక్రమ మ ♦ హంకృతి నేనెఱుఁగంగలేక యు
ద్ధమ్మున కేఁగుదెంచి ఫలి ♦ తమ్మునుబొందితి; నేఁడుపూర్తిగా
" హుమ్మను " నాశమయ్యె; దయ ♦ యుంచి క్షమింపఁ
గదమ్మ నాదు నే
రమ్మున కెన్నఁడింక సమ ♦ రంబునకుం దెగియింప నిట్టిచోన్.

కం. అని దైన్య మేర్పడంగను
మనమునఁ గలయంత వట్టు ♦ మత్సరముడుగన్
వినిపించునక్కరుంగని
కనికర ముట్టిపడ వీర ♦ కాంతయుఁ బలుకున్.

ఉ. ఇత్తఱిమామనంబున నొ ♦ కించుక కోపముగాని లేదు దం
డెత్తితివంచుఁ;దృప్తి వహి ♦ యింపని బాపఁడుగాని, రాజ్యమున్
బొత్తిగ వృద్ధిసేయకయె ♦ భూపుఁడుతృప్తి వహించిగాని రే
కెత్తరటంచుఁ బ్రాజ్ఞులను ♦ టెంతయు జ్ఞానములేక కాదుగా.

ఉ. వండిసఁగూర్కు రాఁక యరి ♦ వర్గముతల్లడ మొందు; నెల్లెడన్
"గండరగండఁడక్బ" రని ♦ గౌరవమేర్పడ శూరవర్యు లు
ద్దండత నుగ్గడింతురు; వి ♦ దగ్ధుఁడ వేయని నేనుఁగూడ నా
నిండుమనంబుతోఁ దలఁతు; ♦ నిక్కమునమ్మిననమ్మకుండిసన్.

ఉ. అన్యమతంబుకన్నఁ దన ♦ దైవ మతంబునయందు సర్వ సా
మాన్యముగా నొకింత యభి ♦ మానము హెచ్చుగు టొప్పు
నేమొ! దా
ర్జన్యముచేసి యన్యుల క ♦ సహ్యముగొల్పు టదేమిగొప్ప సౌ
జన్యము! తండ్రి! యాతురక ♦ జాతిని నీవెటో తప్పి పుట్టవే!

చ. మతములుసర్వమున్నొకటె ♦ మామయునల్లుఁడె, యత్తకోడలే
యతులవివేకివౌట నిజ ♦ మారసినాఁడవు; మంచినేర్పు మై
నితరమతంబులన్ సహన ♦ మేర్పడుచొప్పున గౌరవించి స
మ్మతముగ వానిసారము స ♦ మస్తము వేఱుమతంబుగాఁగని
ర్మితియొనరించినా వునిను ♦ మించుమహాత్ముఁడు లేఁడు నేఁడిలన్.

ఉ. ఏరుతురుష్కులేరు మఱి ♦ హిందువు లీభువి సర్వమానవుల్
గారెసహోదరుల్ భిదలు ♦ గల్గిచరించుచు నున్నలాభమా?

వారలు పేరువేరలును ♦ నారన లోక హితాభి మానులై
కూరిమి నైకమత్యమును ♦ గోరిచరించుచు నున్న లాభమా?

మ. అవినాభావముతోఁ దురుష్కులును వ♦ హ్వానాఁగ వర్తించి హైం
దవులున్న న్యులు నడ్డికట్టిన జగ ♦ త్కల్యాణ మభ్యున్నతిన్
గవిగణ్యంబగుసోదరా! నిజము వ ♦ క్కాణింపుమల్లాకు హైం
దవుఁడంచుందురకంచుఁజిత్తమున భేదంబేమియున్ లేదుగా.

చ. అరుసము మాకు మీ యభిమ ♦ తార్థము; సఖ్యముతోడ
నుందు ; మె
వ్వారికెడి శాశ్వతంబు; మిము ♦ వంటి మహాత్ముఁడు నెయ్యుఁ
డబ్బు ట
బ్బురముగదయ్య! మాసుకృత ♦ ముల్ ఫలియించెఁగదోయి
తండ్రి ! యీ
శ్వరుఁడు క్షమించుతన్ మన దొ ♦ సంగులు; మానవులా
క్షమింటల్!

చ. అనివచియింపగౌరవము ♦ నాదరముల్ ఘటియింపభూపు నొ
య్యనఁగొని తెచ్చి,అక్బరుప్రి ♦యంబుననాతనితోడఁబోయి ప
త్తనమున రెండురోజులు ము♦దంబున వాసముఁజేసి "పోయి వ
త్తును సెలవిమ్ము" నానెనరు ♦ తో నృపుఁ డాతనిఁబుచ్చె
మెచ్చుచున్.

స మా ప్త ము.

వలయువారు :—

ఆర్. వి. నరసింహం

రిటైర్డు హెడ్‌మాస్టరు

తుమ్మపాల

విశాఖపట్నం జిల్లా.